Regd.No.
H. NL. 88
సంపుటి: 56
సంచిక: 26

# జమీన్‌రైతు

28-6-88
శుక్రవారం
18 పేజీలు
75 పైసలు.

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకులు : నెల్లూరు శ్రీరామమూర్తి

# ఇప్పుడు రామారావు రాజీవ్ ముందు నటిస్తున్నాడు!

మా హైదరాబాదు విలేఖరి

విదేశీపర్యటన జయప్రదంగా జరిగినందుకు అభినందిస్తూ ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు ఢిల్లీ వెళ్ళి ప్రధాని రాజీవ్ గాంధీకి వెంకటేశ్వరస్వామి పటాన్ని బహూకరించి రావడం రాజధాని రాజకీయవర్గాలలో సంచలనం రేకెత్తించింది. మరో ముఖ్యమంత్రి అయినా ఈపని చేస్తే ఎవరూ పట్టించుకునేవారు కాదేమోకాని ప్రతిరోజూ ఉదయంనుంచి సాయంత్రంవరకు కేంద్రాన్ని విమర్శిస్తుండే విరోధి రామారావు ఈపని చేయడం అందరికీ ఆశ్చర్యం కలిగిస్తున్నది. ముఖ్యంగా ఆయనను బలపరుస్తున్న మిత్రపక్షాల నాయకులకు ఈ సంఘటన కొరుకుడుపడడంలేదు. ప్రధాని రాజీవ్ గాంధీవైపు రామారావు మొగ్గుతున్నారని కౌన్సిల్ రద్దు తర్వాతనుంచి వారిలో తలెత్తిన అనుమానాలు దీనితో మరింత బలపడ్డాయని అంటున్నారు.

అసలు విదేశీపర్యటనలో రాజీవ్ గాంధీ ఏమిసాధించివచ్చారని రామారావు హడావుడిగా ఢిల్లీ వెళ్ళి ఆయనను అభినందించి వచ్చారు అని పార్లమెంటులో ప్రముఖ యువ ప్రతిపక్ష నాయకుడొకరు వ్యాఖ్యానించారు.

ఢిల్లీకి వెళ్ళిన ముఖ్యమంత్రి జాతీయ ప్రతిపక్ష నాయకులెవరినికలుసుకోకుండా రావడంకూడా ఈ సందర్భంలో చెప్పుకోదగిన అంశమని పరిశీలకులంటున్నారు. మిత్రపక్షం నాయకుల అనుమానాలు ఇలావుండగా కాంగ్రెస్(ఐ)వారు మాత్రం రామారావు రాజీవ్ వైపు మొగ్గుతున్నారనే వాదనతో ఏకీభవించడంలేదు. రామారావు ప్రవర్తనలో ఇటీవల వచ్చినమార్పు మామూలుకానేకాదని ప్రజలముందు నటించే అవసరం ప్రస్తుతం లేనందున రాజీవ్ ముందు ఆయన నటిస్తున్నారని వారంటున్నారు. అయితే రాజీవ్ రామారావుకంటే తెలివైనవారని, రామారావు ప్రతిచర్యను హేతుబద్ధంగా ఆలోచించి ఎత్తులను చిత్తుచేయగలసత్తా ఆయనకు వుందని వారు చెబుతున్నారు. అయితే మిత్రపక్షాల నాయకులు వీరి మాటలను కొట్టివేస్తున్నారు; రాష్ట్ర కాంగ్రెస్‌లోని కిందిస్థాయి నాయకులెవరిని రాజీవ్ ప్రస్తుతం పట్టించుకోవడం లేదని ఆయనకు, ఎన్. టి. ఆర్. కు మధ్య సరాసరి అవగాహన ఏర్పడిందని వారు అభిప్రాయపడుతున్నారు. ఇదిలా ఉండగా, ఆర్థికంగా గడ్డు పరిస్థితి ఎదుర్కొంటున్న రాష్ట్రాన్ని ఆదుకోడానికి ప్రత్యేకంగా సహాయం అందించాలని ప్రధానిని అర్థించడంకూడా రామారావు ఢిల్లీ పర్యటన లక్ష్యమని తెలిసింది. ముఖ్యమంత్రి ఇటీవల నెలరోజులనుంచి

–కొనవ 7వ పేజీలో

## నందమూరి తెలుగు రామారావు

తెలుగుగంగ మొదలు తెలుగు విజ్ఞాన పారితోషికాల వరకు తాను చేసే ప్రతిపనికి 'తెలుగు' ను తగిలించకుండా వుండలేరు ముఖ్యమంత్రి రామారావు. అంతటి తెలుగు వ్యామోహంగల రామారావు తనపేరులో కూడా తెలుగును ఎందుకు తగిలించుకోకూడదు అని ఒకరు ప్రశ్నిస్తున్నారు.

తన పేరులోని 'టి' కి తారక బదులు 'తెలుగు' ను చేర్చి నందమూరి తెలుగు రామారావు అని ఎందుకు పునః నామకరణ చేసుకోకూడదు అని అతనిసూచన. సలహా సముచితంగా వుంది!

# గూడూరు మైకా పరిశ్రమ చరిత్రలో కలిసిపోనున్నదా?

అనగనగా ఒకఊరు; పేరు గూడూరు. ఒకప్పుడు అక్కడ అభ్రకమనే ఖనిజం పుష్కలంగా వుండేది; కృష్ణ రాయల కాలంనాడు రత్నాలు రాసిపోసి నట్లు, ఈ తెల్లబంగారం అమ్మేవారు; మూటలుకట్టి ఎగుమతిచేసేవారట, ...ఈరోజు కాకపోతే రేపైనా ఏ రెండో తరగతి పుస్తకంలోనో ఈ మాటలు గ్రంథస్తంకావచ్చును! ఎందుకంటారా.. అప్పటికి గూడూరులో అభ్రకపు పరిశ్రమ అవశేషాలు మిగలవు గనుక! చరిత్రలో అదొక భాగంగా కలిసిపోతుంది గనుక!

ఏనాటిది గూడూరు మైకాపరిశ్రమ? మూరేళ్లనాటిది చరిత్రలో ఎందరిని శ్రీమంతుల్ని చేసిందో, ఎందరిని బికారులుగా మిగిల్చిందో, ఎన్నివేలమంది కూలివాళ్ల జనం కడుపు నింపిందో లెక్క లేదు. రాయలనాటి రత్నాల వ్యాపారం వలె అత్యంత ప్రాభవంలో వుండిన మైకా పరిశ్రమ దుస్థితిలో పడిపోయింది! పతనించి, నాశనమైపోయే ప్రమాదం ఏర్పడింది!

ఈ శతాబ్ది ప్రారంభంవరకు మైకా వ్యాపారం విదేశీయులచేతిలో ముఖ్యంగా జర్మన్ల అధీనంలో వుండేది. మొదటి ప్రపంచయుద్ధం తర్వాత మొత్తం వ్యాపారాన్ని స్వదేశీయులు హస్తగతం చేసుకున్నారు. అప్పటినుంచి మైకా ఆధార పరిశ్రమలు పెరగలేదుకాని, మైకాగనుల త్రవ్వకంలో అనేక ఆధునిక పద్ధతులు అమలులోకివచ్చాయి. అప్పట్లో చిన్నా పెద్దా కలిసి, దాదాపు 200 గనులవరకు పనిచేస్తుండేవి. నెల్లూరుజిల్లావాసులేకాక, ఇతరరాష్ట్రాల నుండి గూడూరుకు వచ్చి పరిశ్రమలో స్థానం సంపాదించుకొని, స్థిరపడి శ్రీమంతులైనారు. వ్యాపారస్తులు పోటాపోటీలు పడి దేశవిదేశాలనుంచి అధికం గనులకి అవకాశాలు వెదికి,

**మా విలేఖరి**

తాము అపారమైనసంపద లార్జించడంతో పాటు, అమూల్యమైన విదేశీ మారక ద్రవ్యం కూడా సంపాదించిపెట్టారు. గూడూరు డివిజనులో వేలాదికుటుంబాలు గనికార్మికులుగా, ఇతరత్రా మైకాపై ఆధారపడి నిశ్చింతగా కాలం గడప గల్గారు.

అటువంటి పరిశ్రమ ఇప్పుడు చెప్ప లేని దుస్థితిలో పడిపోయింది. యుద్ధంలో సర్వస్వం కోల్పోయి ఒంటరిగా బికారిగా మిగిలినవాడివలె దిక్కుదిక్కుమంటుంది కొడిగట్టిన దీపంవలె మినుకు మినుకు మంటూంది. కార్మికులు, గనులపై ఆశలు వదలుకొని, జీవనాధారం వెదుక్కుంటూ చెట్టుకొకరు, పుట్టకొకరుగా చెల్లాచెదరైపోయారు - మైకా కుబేరులు సైతం గూడూరువదలి, మద్రాసు వంటి నగరాలలో స్థిరపడిపోయారు. దింపుడుకళ్లెం ఆశతో ఇంకాకొద్దిగనులు పనిచేస్తున్నప్పటికీ, అవీ రేపో మాపో మూతబడేస్థితిలో వున్నాయి.

—కొరవ 10వ పేజీలో



## పినాకినీ తీరం

### కాంగ్రెస్ భవనం— జనార్దనరెడ్డి

26 తేది జిల్లాకాంగ్రెస్ ఆఫీసులో జరిగిన కాంగ్రెస్‌వాదుల సమావేశంలో, కాంగ్రెస్ భవనానికి సంబంధించి పార్టీ శ్రేయులలోవున్న అపోహలను తొలగించడానికికాబోలు శ్రీ జనార్దనరెడ్డి కొన్ని వివరాలు చెప్పారు. వాటి సారాంశం- కాంగ్రెస్ భవనం ఏనాడైనా కాంగ్రెస్‌పార్టీఆస్తి; ఏవ్యక్తిదీకాదు; ట్రస్టుదారీ నిర్వహణకు సంబంధించినది మాత్రమే. జనార్దనరెడ్డిగారి ఈమాటలు పార్టీశ్రేయులకే కాదు, ఎవరికైనా ఎటువంటి అపోహలు, అనుమానాలు వున్నా పోద్రోలుతాయనుకుంటాను.

ఈ కాంగ్రెస్ భవనానికి మూడున్నర దశాబ్దాల చరిత్ర. మద్రాసు ప్రభుత్వం ప్రస్తుతం వున్నచోటనే 87 అంకణాల స్థలాన్ని ఇచ్చింది; భవనం పేరుతో చందాలు జరిగాయి; స్లాబ్ లెవల్ వరకు గోడలు లేచాయి! ఆ మొండిగోడలు ఎండ వానా పగుళ్లు బాసి, కత్రతుమ్మ పొదలు పెరిగి, పతనమైన సామ్రాజ్య రాజధాని శిథిలంవలె మొన్నమొన్నటి వరకు సాక్షాత్కరిస్తుండింది; అంతేకాదు, ఆ స్థలం అన్యదీయులు కొందరికి తాత్కాలికంగా దానం చేయబడింది కూడా! పూటకూలి ఇళ్లు, పశువులపాకలు, మునిసిపల్ పిల్చింది వివాదాలు .... బహుజనులకు, బహుముఖ ప్రయోజనకరంగా వుండింది.

జిల్లాలో ఎందరో మంత్రులయ్యారు; మహామంత్రులయ్యారు; సామ్రాట్టులుగా అధికారాన్ని చెలాయించారు; కాని పీఠం దమూ మంత్రులుగా వున్నప్పుడుకాని, కాంగ్రెస్ అధికారంలో వున్నప్పుడుకాని ఆ స్థలానికి చెరతొలగలేదు, ఆ భవనానికి విముక్తికలగలేదు. రాముని పాదస్పర్శతో అహల్యకు శాపవిముక్తి కలిగినట్లు, అధికారాంతరం జనార్దనరెడ్డికి కలిగిన సత్సంకల్పం నెల్లూరు కాంగ్రెస్ భవనం జాతకాన్ని మార్చివేసింది. ఎన్నికలలో ఓటమితో నైరాశ్యం పాలైన కాంగ్రెస్‌వాదులలో ఉత్సాహం పాదుకొల్పి, వారిని కార్యోన్ముఖులనుచేసి, కాంగ్రెస్‌పేరుతో ఏదో కార్యకలాపం సాగడం బాగుంటుందనే భావం జనార్దనరెడ్డి మనసులో మెదలింది; దాన్ని ఆయన వెంటనే క్రియారూపంలో పెట్టారు.

ఒక కమిటీనేర్పాటు చేశారు; బ్లాకు వారీగా కాంగ్రెస్ వాదులను ఇందులో నిమగ్నం చేశారు; కె. వి. సుబ్బారెడ్డి పరిశ్రమల సహకారంతో మంచిగా అక్రమణలను తొలగింపజేసి, భవనం పని ప్రారంభించారు, సంకల్పబలమేమో, వేనకివేలు విరాళాలు అట్లనే చేకూరాయి; భవన నిర్మాణమూ ఆ విధంగానే చకచక సాగింది. ఇందిరా గాంధీ హత్య, రెండుఎన్నికలు కాంగ్రెస్ పునః పరాజయం .... ఇవన్నీ భవన నిర్మాణ ప్రగతిని కుంటుపరచాయి. కాని ఈ అననుకూలాల్నూ, ప్రతికూల వాతావరణాలన్నిటినీ అధిగమించి తిరుగా నిర్మాణం చురుగ్గా సాగుతున్నది; పూర్తి కావడానికి ఎంతోకాలం పట్టకపోవచ్చు

దీనికి ఎంత పని చేకూరిందో నాకు తెలియదు కాని, వచ్చినవిరాళాలలో 80, 90 శాతం కాంగ్రెస్‌వాదులనుండి రాలేదు; కాంగ్రెస్‌మీద భక్తితో ఇచ్చినవారుకారు; కేవలం వ్యక్తిగతంగా జనార్దనరెడ్డి

—కొరవ 10వ పేజీలో

# మండలాలు

### చిట్టమూరు

చిట్టమూరు, సోమసముద్రం, పిట్టివానిపల్లి, రాయపురెడ్డిపాళెం, పోతువానిపల్లి, మంగలవారిపల్లి, ముక్కిడిపాళెం, గంగుపాళెం, వట్రగుంట, వడ్డివానిపల్లి, పాదర్తివారి కండ్రిగ, కంగవరం, మల్లాం, దేవునికండ్రిగ, గొల్లపాళెం, కొత్తపాళెం, కొక్కుపాళెం, బాలిరెడ్డిపాళెం, వల్లంపర్తి, కోగిలి, ఆరిమేను, మన్నెమాల, యల్లసిరి, అక్కరు, పేరంటాళ్లమిట్ట, ఎల్లూరు, వెలిగావారిపల్లి, బురదగలికొత్తపాళెం.

### నాయుడుపేట

పండ్లూరు, కాపులూరు, చిలమతూరు, కంచివాద, తన్నమాల, అనమేడు, కల్లిపేడు; అయ్యవారెడ్డిపాళెం, వెంగమాంబాపురం, మర్లపల్లి, అత్తలపాళెం, విన్నమాల, తుమ్మూరు, నాయుడుపేట (ఎల్.ఎ. సాగరం) పూడేరు, రాయలగుంట, జువ్వలపాళెం, నిరదవాడ, అరవపెరిమిడి, పుదూరు, మేనకూరు, కోనేటిరాజుపాళెం, ద్వారకాపురం, పాళెంపాలెం, యక్రమరెడ్డిపాళెం, తిమ్మాజికండ్రిగ, వద్దిగుంటకండ్రిగ, చిగురుపాడు, చిగురుపాడు అగ్రహారం, శ్రీమనవరం, లింగసాళెం, కాటమంచివారి కండ్రిగ, గొట్టిప్రోలు.

మొత్తం 33 గ్రామాలు.

### పెళ్ళకూరు

పాల్చూరు, చావలి, పెన్నేపల్లి, కాళ్వాయపాడు, సిరసనంబేడు, కానూరు, జీలపాటూరు, చిల్లకూరు, కొత్తూరు, కలవకూరు, పుల్లూరు, నెలబల్లి, పెళ్ళకూరు, చెన్నప్పనాయుడుపేట, దొనమూరు, పుత్తూరు చెరుకుకట్ట కండ్రిగ, కామాక్షి, దామరాయకండ్రిగ, బంగారంపేట, చెంబేడు, పనకాక, అర్ధమాల, మోదుగులపాళెం, ఉడిపూడి, అంకవోలు, చింతపూడి, అర్లపాడు, చెట్టిగుంట, నందిమాల, యెర్రగుంట

మొత్తం 29 గ్రామాలు

### ఓజిలి

మాచవరం, కుందాం, యేనుగువాడ, కరూరు, ముమ్మాయపాళెం; అత్తివరం కొత్తపాళెం, అత్తివరం, కొత్తచెరువు, కరబల్లపోలు, నెమళ్ళపూడి, మనవాలి, పున్నేపల్లి, జోస్యులవారికండ్రిగ, కొత్తపేట, గ్రద్దగుంట, గ్రద్దగుంట అగ్రహారం, రాజుపాళెం, వాకాటివారికండ్రిగ, వెంకటరెడ్డిపాళెం, విజయనెల్లూరు, రుద్రాయపాళెం, అదాయ్యల పార్లపల్లె, కుడుగొండ, కొండపల్లిపాడు, మన్నెమాల, బత్తలపురం, ఓజిలి, రాచపాళెం, వగుటూరు, వీర్లగుడిపాడు, అరిమేనిపాడు, కార్జిమేడు, గుర్రంకొండ, చిలమానుచేను, రాఘవరెడ్డిపాళెం, పెదపెరియపాడు, భట్లకనుపూరు, పెదపరియ, భువనగిరిపాళెం, పోలిపాడు, ఇంగారుగుంట, పాళెంపాడు, ఇనుగుంట, రావిపాడు, తిరుమలపూడి, కంగరాజసముద్రం, లింగారెడ్డిపల్లి, లింగారెడ్డి బత్తుకట్టుబడి, రాజానగరం.

మొత్తం 49 గ్రామాలు

### సూళ్ళూరుపేట

వంట్రంగం, కటవత్ర, దామరాయ, కొరిడి, సామంతమల్లాం, అటాక, బంగాలపల్లి, కొమ్మినేనిపల్లి, వల్వారెడ్డి కండ్రిగ, నాదెళ్ళవారికండ్రిగ, దామనెల్లూరు, రామచంద్రగుంట, సుగ్గుపల్లి, మతకమూడి, ఉగ్గుమూడి, మంగళంపాడు, ఇలుపూరు, నూకలపాళెం, సూళ్ళూరు బత్తుకట్టుబడి, కోటపోలూరు, మన్నెముత్తేరి, కుదిరితిప్పకండ్రిగ, అటకానితిప్ప, కుదిరి, కుదిరిచెరువుపల్లె, సింహాద్రిగుంట, కృష్ణారెడ్డితాగేలి, దేగంపాళెం, మెరకపాళెం, మన్నారుపోలూరు, వట్రపాళెం, సూళ్ళూరు, దువ్వాడిగుంట, కేశవరెడ్డిపాళెం, నడమంటికండ్రిగ, జల్లిచెలికల, కొన్నెంబట్టు, పండులగుంట, షార్ ప్రాజెక్టు, వెంగళపొమ్మారు, మద్దెమడుగుతాగేలు, మంగానెల్లూరు, అచ్చుకట్ల, గోపాలరెడ్డిపాళెం,

మొత్తం 48 గ్రామాలు.

### దొరవారి సత్రం

కొత్తపల్లి, పూలతోట, కట్టువపల్లి, కరటమూడి, ఆనెగొట్టం, మైలంగం, నేలపట్టు, వెంగమాంబపురం, యేకొల్లు, పెయ్యలపాక, కరికాడు, కరికాడు దామరాయకండ్రిగ, కల్లూరు, కల్లూరు కండ్రిగ, అడవమూడి, సూరగుంట తాగేలి, సూరపు అగ్రహారం, అక్కరపాక, మున్నేరి, వెలికాడు, మీజూరు యల్లాయపాళెం, తొగరామూడి, శ్రీరసమల్లి, అయనపాళెం, మేలుపాక, మావిళ్ళపాడు, తనయలి, బూదూరు, వేటగిరిపాళెం, బురదమడుగు ఉమ్మారు, తళ్ళంపాడు, లింగంపాడు, మినమముడి, చందనముడి, మోదుగులపాళెం, నెలబల్లి, నెల్లూరుపల్లి, వడమటికండ్రిగ, వదిమికండ్రిగ, ముచ్చలగుంట, వెదురుపట్టు, సింగనలత్తూరు.

మొత్తం 44 గ్రామాలు.

—కొనవ 11వ పేజీలో

చిట్టమూరు
నాయుడుపేట
పెళ్లకూరు-ఓజిలి
సూళ్లూరుపేట
దొరవారిసత్రం
తడ-దక్కిలి
వెంకటగిరి
బాలాయపల్లి

కొత్తవరత్తూరు, చిల్లమూరు, కలగుత్తిపాడు, తిమ్మనపాళెం, మెట్టు, గువపాడు, పెళ్ళకూరు, ఈశ్వరవాక, యర్లమూడి, బంగారంపల్లి, అద్దెపూడి, ఓబ్బులంపత్రి, యాకసిరి, మొలకలపూడి.

మొత్తం గ్రామాలు 41.

రైతులకు దేవుడిచ్చిన శాపమా?

# ధాన్యముంటే ధర వుండదు- ధర వుంటే ధాన్యముండదు!

పురుషులలో పుణ్యపురుషులు వేరన్నట్లు రైతులలో నైతం అదృష్టవంతులు వేరా? ధర వున్నపుడు రైతువద్ద ధాన్యం లేక పోవడం, ధాన్యం వున్నపుడు ధర లేక పోవడం; లేదా, గిరాకీ వున్న వాణిజ్య పైరును రైతు సాగుచేయకపోవడం రైతు సాగుచేసిన పైరు దెబ్బతినడమో. ధర లేకపోవడమో జరగడం రైతు పాలిట ఒక శాపమా?

నెల్లూరు జిల్లా రైతాంగానికి సంబంధించి రెండూ వత్సరాలనే అనిపిస్తుంది. రెండేళ్ళ క్రితం మొలగొలుకులు కనీవిని ఎరుగని ధర పలికింది; పాత ధాన్యం పుట్టి రెండువేల రూపాయల హద్దును దాటింది. ఆ సంవత్సరం అదాయం మరగిన ధనవంతులైన రైతులు తమకు పండినవే కాకుండా, సన్న గాళ్ళ వద్ద మహసూలులోనే కలీసుగా కొని గాదెల నింపి పెట్టుకున్నారు. ధాన్యం స్థానంలో ధనాన్ని నింపుకోవచ్చుననే ఆశతో; పుట్టి రూ 1400 ల వంతున కూడా కొన్న పెద్ద వాళ్ళున్నారు; ఆ ధరకు అమ్ముకోకుండా వని రూపాయలు పెరుగుతుందేమోననే ఆశతో అమ్ముకోని సామాన్య రైతులూ వున్నారు. సామాన్య రైతు ఎక్కువ కాలం వేచుకోలేడు కాబట్టి, కొంత కాలం చూసి అమ్మేసుకున్నాడు. పెద్ద రైతుకు మాత్రం గతానుభవంతో రెండు వేలమీదనే కన్నువుంది. 1984 ధాన్యం 1985 ఏప్రెల్ వరకు కూడా అమ్ముకో లేదు. ధర కోసం ఎదురు చూసిచూసి కండ్లు కాయలు కాచి పదిహేను మాసాల తర్వాత తాము కొన్న ధరకంటే తక్కువ ధరకు తెగనమ్ముకున్నారు; మాకు తెలిసి ఒకరైతు 1984 మొలగొలుకులు 1985 మే లో పుట్టి రూ 1200 ల వంతున కాదోలు అమ్ముకున్నాడు; 1984 జనవరి, ఫిబ్రవరిలో పుట్టి రూ 1400 లు వుండేది. దురాశకుపోతే అంతే!

**ఈ యేడు పత్తి పైరు కనులపండువుగా వుంది...కాని కాపు ధర తక్కువ!**

ఈ అనుభవంతో ఈ సంవత్సరం రైతు లందరూ కోతలు అయ్యీ కాగానే నూరిపి వున్న ధరకు అమ్మేసుకున్నారు. వచ్చి నంతవరకు లాభం అనుకున్నారు. దాని వల్ల రైతువద్ద ధాన్యమే నిల్వ లేకుండా పోయింది; అందువల్ల ధర తారాజువ్వ వలె సర్ మంటూ పెరిగిపోతున్నది; ఈనాడు మొలగొలుకు పుట్టి రూ 1600 లు; జూలై ఆఖరుకే అది రెండువేల రూపాయలు కావచ్చునంటున్నారు.

ఎడగారుకు సంబంధించి గత సంవత్సరం తుంగ్రో వైరస్‌తో [illegible] రాలేదు; రైతు దెబ్బతినిపోయాడు. కాని మన్నాలకు ధరమాత్రం ఇప్పుడే పుట్టి రూ. 1400 లు వుంది; అది ఇంకా పెరగవచ్చు. గత చేదు అనుభవంతో ఈ సంవత్సరం మొలగొలుకు అడుగు అవకాశమున్న ప్రతిరైతూ పత్తి సాగుచేశాడు. పత్తి ఎన్ని ఎకరాలలో సాగైవుంటుందో చెప్పలేము కాని, గతంలో ఏ సంవత్సరమూ లేనంత అధికవిస్తీర్ణంలో సాగైంది. చెట్లు బ్రహ్మాండంగా వున్నాయని రైతులు చంకలు ఎగురవేశారు; విరివిగా పత్తి చేలు కనువిందుగానే వుంటినాయి. కాని తీరా విరుగుకాపు కాపులేదు; పూత పిందె రాలి పోతున్నదట; ధర కూడా గత రెండు మూడు సంవత్సరాలలో వున్నంత లేదట, తగ్గిపోయిందట; తక్కువ ధరకైనా కొనే వాడు లేడట; పత్తి పెట్టి పాడైపోయామురా దేవుడా అని రైతులు వాపోతున్నారు.

రైతు ఏ పైరు పెడితే దానికి ఏదో ఒక రోగమైనా వస్తుంది; గిరాకి అయినా లేకుండా పోతుంది; ధర అయినా పడి పోతుంది; అది అతనికి దేవుడిచ్చిన శాపం వరి, పత్తేకాదు; ఏ పైరుపైనా తీసుకోండి, ఏ వాణిజ్యపంటపైనా తీసుకోండి, రైతు స్థితి ఇంతే, రైతు గతి ఇంతే!! అట్లా కాకుంటే ఈ ధరల రాకడ, పైర్ల పోకడ ఏమిటి?

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## కలెక్టరు సుజాతారావు

హార్దికమైన వీడ్కోలులో, శక్తివంచన లేకుండా, అవిశ్రాంతంగా జిల్లాప్రజలకు ఏదో చేయగలిగాననే సంతృప్తితో నెల్లూరును వీడవలసిన కలెక్టరు కుమారి సుజాతారావు గోదావరి కన్న హృదయంతో నేరుగా మనవ్యక్తతో పోవలసిరావడం నిజంగా మనందరికీ కూడా బాధాకరమైన విషయం.

కెనడాలో వుండిన ఆమె పెద్దక్క డాక్టర్ శ్రీమతి పద్మిని కుమారులిద్దరు సంజయ్ (14), దీపక్ (12) తాత అవ్వలైన డాక్టర్ కె యల్. రావు దంపతులను చూడడానికి భారతదేశం వస్తూ, 23 తేది ఐర్లెండువద్ద జరిగిన విమాన ప్రమాదంలో దుర్మరణం పాలైనారు. ఆ పిల్లల తండ్రి శ్రీ తుర్లపాటి లక్ష్మినారాయణ. అంతకుముందు షైరోబీలో కాపోతుండిన లక్ష్మినారాయణదంపతులు ఈ ఇద్దరు పిల్లల చదువు, వుజ్వల భవిష్యత్తుకోసం కెనడాకు మకాంమార్చారట. తమ పిల్లలనుగూర్చి వారు ఆశించిన బంగారు భవిష్యత్తు రెప్పపాటులో నీటిబుడగలా పగిలిపోయింది; ఈనాడు లక్ష్మినారాయణ దంపతులు తీవన్ళవాలు! ఈ ఇద్దరు పిల్లలలో దీపక్ ఇంగ్లీషులో చక్కని కవిత్వం వ్రాస్తాడట! చివరగా మృత్యువునుగూర్చి ఆ అబ్బాయి వ్రాసిన గేయం అతని దివ్యదృష్టిని సూచిస్తుందేమోనని సుజాతారావుగారంటారు.

ఆ పిల్లల పిన్నితేని మరణాన్ని, తన సోదరి పుత్రశోకాన్ని తలచుకొని సుజాతారావు క్రుంగిపోయారు. తన సోదరి కెనడానుండి వచ్చేస్తున్నదని, దుఃఖ సాగరంలోవున్న ఆమెతోటి కొంతకాలం గడపడానికి తాను ఆరు వారాలపాటు సెలవులో వెళ్లతున్నానని ఆమె చెప్పారు. ఆమె శనివారం (29 తేది) బయలుదేరిపోతున్నది. ఆమెను పరామర్శించడానికి కలుసుకున్నవారికి "ఇక మిమ్ము లను నెల్లూరులో చూడలేను" అంటున్నది. దీన్నిబట్టి ఆమె నెల్లూరును శాశ్వతంగా వదలిపెడుతున్నదనే అనుకోవలసి వస్తున్నది.

కలెక్టరుగా కాస్త కాఠిన్యాన్ని ప్రదర్శించినా సుజాతారావుగారి నిష్పాక్షికతను మాత్రం మరువలేము. ఆమెకు సానుభూతిని, గౌరవపురస్కరంగా వీడ్కోలును చెప్తున్నాము.

## శ్రీ వెంగళరావు

ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు 1 తేది ఉదయం నెల్లూరులో దిగుతున్నారు, ఆర్-అండ్-బి, గెస్టుహౌస్‌లో టి. కాం., బ్రేక్‌ఫాస్టు, 9 నుండి 11 గంటలవరకు కాంగ్రెస్ వాదులను, ఐ ఎన్ టి యు. సి., యూత్ కాంగ్రెస్, విద్యార్థి కాంగ్రెస్ నాయకులను కలుసుకుంటారు; 11-12 మధ్య కాంగ్రెస్ భవనం సందర్శన; మ. 3 గం. టవున్‌హాలులో కాంగ్రెస్ కార్యకర్తల సమావేశం; 7 గంటలకు రైల్లో ఒంగోలుకు ప్రయాణం.

వెంగళరావుగారి కార్యక్రమాల్లో పరోక్షంగానో, నేపథ్యంలోనో కొంత తెలుగుదేశీయుల పాత్ర, ప్రమేయం వుండబోతుందని ఒకరంటారు. చూడకుండా కుతలిప్రాయపడడం భావ్యంగా వుండదు.

## మంత్రులు

రెవిన్యూ మంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి 3 తేది ఉదయం మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో దిగుతున్నారు. ఆరోజంతా జిల్ల సమావేశాలు; 4 తేది బుచ్చి, 5 తేది వెంకటాచలం, 6 తేది కోట, 7 తేది వింజమూరు, 8 తేది కోవూరు సమితులలో పర్యటన. ఆ రాత్రికే హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్ ఎక్కుతారు.

శ్రీనివాసులురెడ్డిగారి రెవిన్యూ మంత్రిత్వంలో సగభాగం నెల్లూరు పర్యటనలోనే గడచిపోతున్నట్లుంది.

• • •

చిన్న పరిశ్రమల మంత్రి శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి 28 తేది సాయంత్రం ఒంగోలు నుండి వస్తారు; 29 తేది 'లాయర్' ప్రత్యేక సంచిక ఆవిష్కరించి హైదరాబాదు వెళ్తారు.

## అంతపెద్ద అధికారి ఇంత దుడుకుపడడమా?

గూడూరు తాలూకా పిడూరులో 1977 లో మెట్టభూమి కొంత హరిజనులకు సాగుకు లీజు పట్టాలిచ్చారు; వాళ్లు సాగు చేయనందువల్ల 1981 నవంబరులో అదే భూమిని అన్ని కులాలకు చెందిన 118 మందికి ఇండ్లస్థలాలకు పట్టాలిచ్చారు; సర్వేయరు వచ్చి ఎవరి ప్లాటు వారికి పంచిపోయాడు; అక్కడ ప్రభుత్వమే మంచినీటి సౌకర్యంకూడా కల్గించింది; కాని వారు ఇళ్ళకు శంకుస్థాపన చేసుకోకుండా 1977 లో సాగుకు పట్టాలుపొందినవారు అడ్డుపడ్డారట. అది అప్పటినుండి వివాదంలో వుంది; జావాలు, స్టేలలో వుంది.

ఆవివాదం పరిష్కారానికి జాయింట్ కలెక్టరు శ్రీ దయాచారి గూడూరు సబ్ కలెక్టరాది పరివారంతో 21 తేది పిడూరుకు పోయాడట; పుభయపక్షాల వారినీ సమావేశపరచారట; ఇళ్ళస్థలాలవారు ఇది మెరకప్రదేశంకాబట్టి, రోడ్డు ప్రక్కనున్నదికాబట్టి నివాసానికి అనుకూలమని, దీన్ని తమకు ఖాయంచేసి, చెరువువద్ద ప్రత్యామ్నాయం అనుకొనివున్న పల్లపుభూమిని సాగుకు కేటాయించమని చెప్పుకున్నారట. జాయింట్ కలెక్టరుగారు వీరి విజ్ఞప్తిని త్రోసిపుచ్చి వారిని ఏదో పరుషంగా మాట్లాడారట; అందులో ఓడూరు లక్ష్మినారాయణ అనే వ్యక్తి "మీ రాజకీయంగావుంది; చాలవంప త్పరాలనుండి పరిష్కారం కాకుండా వుంది" అన్నాడట. దాంతో జాయింట్ కలెక్టరుగారు లక్ష్మినారాయణను చెంప చెళ్ళుమనేట్లు కొట్టాడట; అయనకు కత్తామగా ఇమాం అనే రెవిన్యూ ఇన్స్పెక్టరు జవానుకూడా లక్ష్మినారాయణ జుట్టుపట్టి కాని వంగదీసి దబదబా వాగు బాదాడట. తర్వాత ప్రక్కన ఎవరినో అడిగి మున్నూరుమంది పేర్లువ్రాసుకొని, మీ అంతుతేలుస్తాం అంటూ జీపు ఎక్కి వెళ్ళిపోయారట. లక్ష్మినారాయణ హరిజనుడుకాడు; ట్రాక్టరు డ్రైవరుగా పని చేసుకుంటున్న పేద రెడ్డికులస్తుడట; కాని పరువుగలవాడే!

ప్రత్యక్ష సాక్షులుచెప్పిన కథనం సారాంశంఇది. జాయింట్ కలెక్టరుకు ఏది చెప్పుకోబోయినా 'ముండ' అంటూ నీచంగా తిట్టాడట; తెల్లగా చొక్కాలేను కొని వున్నారే మీ కేంగాదు స్థలం కావాల్సొ లేదాఅన్నాడట. జిల్లాస్త్రీలపై సౌమ్యంగా ఒక్కమాట మాట్లాడలేదని వారంటారు.

వారు పేదవారు; విన్నపాయులు; కాబట్టే జాయింటు కలెక్టరంతటి బాధ్యతగల వ్యక్తి ఇంత దురుకుగా ప్రవర్తించ గలిగారు. ఇంకొకరైతే పూరుకుంటారా? అంత పెద్ద అధికారికి ఏదైనా పరాభవం జరిగితే ప్రభుత్వానికే అవమానంకాదా?

ఏమైనా ఒక సామాన్యుణ్ణి కొట్టడం ద్వారా జాయింటు కలెక్టరు తన హోదానే కించపరచుకున్నారు!

## స్త్రీలు చీకటి మార్గాన్నే పోయిందా?

వెంకటాచలం సమితి కార్యాలయ సదనంలో వుంచిన సుమారు రెండు లక్షల రూపాయల ఇనుపరేకులు ఇటీవల ఒక రోజు రాత్రికిరాత్రి అదృశ్యమయ్యాయని వ్రాశాము.

అది ఇంటిదొంగలు చేసిందేనని, చీకట్లో అమ్ముకొని క్యాష్ చేసుకున్నారని అక్కడ అనుకొంటున్నారు. ఇంత పెద్ద అక్రమాన్ని విచారించేనాథుడేలేడా?

## బి. ఎం. ఎస్. సభలు

భారతీయ మజ్దూర్ రాష్ట్రమహాసభలు 22, 23 తేదులలో నెల్లూరు చర్చి మైదానంలో బ్రహ్మాండంగా జరిగాయి. కార్మికలోకంలో బి.జె.పి. వారు ఇంతగా చొచ్చుకపోగల్గారా అని ఆశ్చర్యపడేంత అట్టహాసంగా, జనసమ్మర్దంగా జరిగాయి. పలువురు కేంద్రనాయకులు పాల్గొన్నారు.

## ఫాన్ల దొంగతనం

టవున్‌హాలు ప్రాంగణంలోని లేడీస్ పట్టాభిరామరెడ్డి రీడింగురూంలో 26 తేది రాత్రి ఆరు సీలింగుఫాన్లు చోరప్రస్తమైనాయట. వేసినతాళం వేసినట్లేవున్నాయట; అవి ఏదారిన పోయాయో మరి?



## విమాన ప్రమాదంలో నెల్లూరు ఇల్లాలు

23 తేది ఐర్లెండు తీరాన సముద్రంలో కూలిపోయి అమాయకంగా ప్రాణాలు పోగొట్టుకున్న 329 మంది విమానప్రయాణీకులలో నెల్లూరు ఇల్లాలు కూడా ఒకామె వుంది.

ఆమెపేరు ప్రభావతమ్మ (34); గూడూరు శ్రీ మెుంగల సుబ్బరామరెడ్డి పెద్దకుమార్తె, అమెరికాలో ప్రొఫెసరుగా పనిచేస్తున్న శ్రీ ఎం. శ్రీనివాసులురెడ్డి సతీమణి; ఉల్లాయపాలెం శ్రీ కలేటి చంద్రారెడ్డి కుమార్తె.

తన భర్తను, ముగ్గురు బిడ్డలను అమెరికాలోనే వదలి పుట్టింటికి కాబోలు వస్తుండినది; దారిలోనే గిట్టినది! విధి విలాసం ఎంత క్రూరం!

## సహస్రమాన జీవి

మేము వై. బి. రెడ్డిగారిని సహస్రమానజీవి అనడంలో సంకోచించడం లేదు; వెయ్యి మాసాల వయస్సుసున్న వారంటాము. ఆ సాహిత్యాభిమాని, సాహిత్య పోషకుడు, అభ్యుదయ కర్షకుని అభినందనసభ 30 తేది సా. 6-30 కు టవున్‌హాలులో జరుగుతుంది. ఆందరం హాజరై నూటఇరవై ఏళ్ళ జీవితాన్ని సార్థకంగా పూర్తి చేయమని ఆశీర్వదిద్దాం రండి!

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | (9672) పుట్టి | 1600-00 |
| ,, | (9674) | 1625-00 |
| ఐ. ఆర్. 20 | ,, | 1400-00 |
| 2508 | | 1350-00 |

# కిరాతకుడు

(5వ పేజి తరువాయి)

క్రక్కలేక మ్రింగలేక ఉక్కిరిపోయేదట.

రోజులుగడిచేకొద్దీ వీరిద్దరి ప్రేమాయణం, రంకుతనం ముదిరిపోయాయి. సుబ్రహ్మణ్యం, తమ ప్రేమలేఖలను సుదర్శన చేతనే చదివి వినిపించుకునే వాడట. వాటిలో పరమ నీచమైన బూతు పదాలుకూడా వుండేవట. విధిలేక ఆవి చదివి గ్రుడ్లనీరు క్రుక్కుకుని వినిపించే సుదర్శనను చూసి ఇద్దరూ వినోదించే వారట. ఆమెకే టాటాలుచెప్పి, చెట్టాపట్టాలేసుకుని, షికార్లు బయల్దేరేవారట.

తనువుదించుకుంటే కాళ్ళమీద పడుతుందని, పాపం సుదర్శన ఈ చిత్రహింసను మౌనంగా సహించేదట. కొంత కాలం తర్వాత, సుబ్రహ్మణ్యం పెళ్ళికి గుడ్‌బై చెప్పి, హిమబిందుకోసం పలనసేను మకాం మార్చేశాడట.

కట్టుకున్నది ఎంత అమాయకురాలైనా, గంగిగోవైనా, తామిట్లా తంతు తనం వెంబెట్టడం మంచిది కాదనుకున్నారేమో, మళ్ళీ తామ యింటికొచ్చి, తానో పెళ్ళి చేసుకోడానికి అనుమతి నివ్వమని సుదర్శనను ఒత్తిడిచేశాడట. ఇంతకాలం ఎన్నో అవమానాలు, చిత్రహింసలు భరించిన ఆ భారత నారి, ఇందుకుమాత్రం ఒప్పుకోలేదు. అనుమతి పత్రంకోసం ఎన్నిసాటకాలాడినా ప్రలోభాలు చూపినా లొంగదు.

చివరి ప్రయత్నంగా 20 తేది సాయంత్రం ఆమెను తీసుకుని తన స్నేహితుడింటికి వెళ్లాడట. అక్కడ హిమబిందు, ఆమె తల్లి దండ్రులు సుదర్శనను ఒంటరిదాన్నిచేసి పెట్టాల్సిన బాధలన్నీ పెట్టారట. అయినా ఆమె వినలేదు.

వెంటనే ఆ దుర్మార్గుడు సుదర్శనను ఇంటికి తీసుకుని వచ్చేశాడట. ఇంతలో ఏమి జరిగిందో, వాడిలో మానవత్వం నశించి, దానవత్వం ప్రకోపించినట్లుంది. అర్ధరాత్రి సమయంలో సుదర్శనను మంచానికి జడతో కట్టివేసి, ఒంటినిండా కిరోసిన్ చల్లి తగులబెట్టాడట. అరవకుండా దిండుతో ముఖం అదిమిపెట్టాడట. అయితే మంటలు చూసి, ఆ పాపిష్టి మొగుడి తమ్ముడే పరుగెత్తుకుని వచ్చి సుదర్శనను మంటలబారినుండి తప్పించి, స్థానిక డాక్టరుకు చూపిస్తే, ఆయన నెల్లూరుకు తీసుకుని పొమ్మన్నారట. వెంటనే ఆమెను రామచంద్రారెడ్డి ఆస్పత్రికి తరలించి, నెల్లూరు డి ఎం అండ్ హెచ్ ఓ ఆఫీసులో పనిచేస్తున్న ఆమె అన్న నాగేశ్వరరావుకు విషయం చెప్పారట.

విషయంతెలుసుకొని నాగేశ్వరరావు పరుగెత్తుకొనిపోయేసరికి కొనవూపిరిలో ఉందా ఇల్లాలు. తనభర్త తనను ఎట్లా వేధించిందీ, తగులబెట్టి చంపబోయిందీ వివరంగా, వెక్కివెక్కి ఏడుస్తూ అన్నకు చెప్పుకున్నదట. అయితే నాగేశ్వరరావు ఎంత ప్రయత్నించినప్పటికీ, పోలీసులు, మేజిస్ట్రేట్ సకాలంలో రాకపోవడంవల్ల సుదర్శన మరణవాఙ్మూలం సాక్ష్యాధారాలు లేనిదైపోయింది.

ఇంతజరిగాక, ఇప్పుడు ఆ కిరాతకుడు తన భార్య తనకుతానే ఒళ్లుకాల్చుకుని చనిపోయిందని చెప్తున్నాడట. ఈ వాదాన్ని ఎవరూ విశ్వసించినట్లు లేదు.

సుదర్శన శరీరంపైన కేవలం ముందు భాగంలోనే కాలిన గాయాలున్నాయి. ఆమెను మంచంపై పడవేసి, కాల్చి, కదలకుండా అదిమిపెట్టడంవల్లనే, వీపు భాగానికి మంటలు సోకలేదని చెప్తున్నారు డాక్టరు. శవపరీక్ష ప్రకారం పాపమా యువతి 30 నిముషాలపాటు అగ్నిదేవేరి కౌగిల్లో కాలంగడిపిందని తెలుస్తున్నది. పగవాడికికూడా ఇంతటి చిత్రహింస ఊహించలేము



16 తేది నెల్లూరు టౌన్‌హాల్లో హిప్నటిజం కళద్వారా ప్రేక్షకులను మట్టిబొమ్మలవలె ఆడిస్తున్న ప్రొఫెసర్ టి. వి. రావు.

సుదర్శన తనకుతాను తగులబెట్టుకుని వుంటే, ఒంటిపైనంతా గాయాలు వుండి వుండాలి మంటలు దహించివేస్తున్నా, మంచంపై కదలకుండా పడివుండడం మానవమాత్రులకు సాధ్యంకాదుగదా!

సుదర్శనను ఆమె మరిది రక్షించడానికివచ్చేసరికి, సుబ్రహ్మణ్యం సైగ్గా వెళ్ళిపోయాడట. అతను ఏనేరమూ చేయకుంటే, ఆమెను ఆస్పత్రికి తీసుకొని పోయివుండవచ్చుకదా!

ఇంతా ఘోరం, ఆమె చనిపోయిన తర్వాత, దహన సంస్కారాలకుకూడా సుబ్రహ్మణ్యం కాని, అతడి తల్లి దండ్రులుకాని రాలేదట.

ఈ నీచుడు ఇంత దౌర్భాగ్యంగా ప్రవర్తిస్తే, పాపం సుదర్శన ఏమిచేసిందో తెలుసా? చావబోయేముందు అంతా చెప్పి అన్నను చివరికోరిక కోరింది-తన భర్తను ఏమీచేయవద్దని, ఆ మహాఇల్లాలి మొగుడనని చెప్పుకోవడానికికూడా ఈ దౌర్భాగ్యుడు తగడు.

ఇతడికి పెళ్ళికిముందే మరొక వగలాడితో విడదీయరాని సంబంధం వుండి వుంటే, ఆమెనే పెళ్ళిచేసుకుని వుండవచ్చు. అలాకాకున్నా, ఇంకొకరి ఒంటరి జీవితాన్ని బుగ్గిపాలు చేయవలసిన అగత్యమేముంది?

సుబ్రహ్మణ్యం ఇప్పుడు తప్పించుకుని తిరుగుతున్నాడు. అతనికి ఎక్కడున్నా పట్టి న్యాయస్థానంలో కఠిన శిక్ష విధింపజేయవలసిన బాధ్యత పోలీసులపై వుంది. భవిష్యత్తులో మరొక దుర్మార్గుడెవడూ ఇటువంటి పాశవికత్వానికి దిగకుండా హెచ్చరికగా వుండాలి ఆ శిక్ష.

పాపం సుదర్శన తల్లి దండ్రులు సోదరులు శోకసముద్రంలో మునిగిపోయి వున్నారు. వారిని ఓదార్చడం ఎవరితరమూ కావడంలేదు.

## పంచాంగం

### పునర్వసుకార్తె

5-7-1985 తేది శుక్రవారం రాత్రి 12-02 గంటలకు పునర్వసుకార్తె ప్రవేశము, సువృష్టి

**జూన్ తిథులు**

29 శని ద్వాదశి రా 11-21 గం. వ.
30 ఆది త్రయోదశి రా 9-03 గం. వ.

**జులై తిథులు**

1 సోమ చతుర్దశి సా 6.59 గం. వ.
2 మంగళ పూర్ణిమ సా 4-58 గం. వ.
3 బుధ బహుళ పాడ్యమి ప 3-48 గం.
4 గురు విదియ ప 2-50 గం. వం.
5 శుక్ర తదియ ప 2-17 గం. వ.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి.



'ఓ ఇంటి కాపురం'లో చంద్రమోహన్, భానుప్రియ

# నిర్మాతల అనైక్యతే నటులకు శ్రీరామరక్ష

తెలుగు చలన చిత్ర పరిశ్రమలో గతంలో రెండుసార్లు ఇప్పటిలా అనిశ్చిత పరిస్థితి ఏర్పడ్డప్పుడు ఎ. ఎన్. ఆర్., ఎన్. టి. ఆర్‌లు చిత్రపరిశ్రమ పురోభివృద్ధి కాంక్షించే బాధ్యతగల నటుల్లా వ్యవహరించారు. ఎంతో డిమాండ్‌లో వున్నా తమ పారితోషికాల్ని తగ్గించుకున్నారు ఉదారంగా, మళ్ళీ చిత్ర పరిశ్రమ పుంజుకోగానే తమరేట్లను పెంచుకున్నారు. కాని, ఇప్పటి నటీనటులు తమ పారితోషికాల్ని తగ్గించుకోడానికి సంసిద్ధులన్న అని ఒకరిద్దరు నటులుచేసిన ప్రకటనలు హాస్యాస్పదమని తేలిపోయింది. ఈ ప్రస్తావనను కొందరు నిర్మాతలు తెస్తే, "పత్రికలవాళ్ళు పేజీలు నింపుకోటానికి ఏదో రాసుకున్నారు, వాళ్ళతో నేనెప్పుడూ అలా తగ్గించుకుంటున్నట్లు అనలేదు" అన్నాడట ఒకనటుడు. మరో నటుడు "మా రేట్లు తగ్గించుకుంటేమాత్రం నిర్మాతల సమస్య తీరిపోతుందా? అప్పటికీ ఇప్పటికీ చిత్ర నిర్మాణ వ్యయం ఎంతగా పెరిగింది? ఫిలింరేటు పెరగలేదా? స్టూడియో అద్దె పెరగలేదా? పెట్రోల్ ధర పెరగలేదా? వాటిని భరిస్తూ మామీదపడి ఏడ్వటం దేనికి?" అన్నాడట.

నిజమే, ఒకసారి రేటు బాగా పెంచాక మళ్ళీ తగ్గించడానికి ఎవరికి మనసొప్పుతుంది?

ఐతే, ఈ సినిమా పరిశ్రమ సంగతి ఇంతేనా?

కొందరు నిర్మాతలు మాత్రం మామూలు హెచ్చింపురేట్లకే అగ్రిమెంటు బుక్ చేసుకుని చిత్రాలు ప్రారంభిస్తున్నారు.

నిర్మాతలలో ఐకమత్యం లేనందువల్లే పరిస్థితులు అంతకంతకు దిగజారుతున్నం.

# అలహాబాద్‌కుపోను అమితాబ్‌కు తీరికేది?

"హఠాత్తుగా నేను ఈ రాజకీయాలనే రొంపిలో దిగబడ్డాను. ఐనా, నేను పార్లమెంట్ సభలకు హాజరుకానక్కర్లేదని ప్రధానమంత్రి, పార్లమెంటరీ వ్యవహారాల శాఖామాత్యులు కె. ఎల్. భగత్‌గార్లు అనుమతి దాదు గనుక నేనిదివరకు అంగీకరించిన సినిమాలలో నటిస్తాను," అని అమితాబ్ బచన్ ఒక ఇంటర్వ్యూలో చెప్పిన విషయాలు 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా' ఆదివారం అనుబంధ సంచికలో పడింది. ఇది కొందరికి బాధకలిగించింది, ముఖ్యంగా ఆర్థికశాఖామాత్యులు విశ్వనాధ్ ప్రతాప్ సిన్హా. మాజీ ఎం.పి; హిందుస్థాన్ లివర్ కంపెనీ మాజీ ప్లానింగ్ మేనేజర్ సాంబ్‌ఐక్రిపింగ్ మరింత నొచ్చుకున్నారు. "రాజకీయాలు రొంపి అయితే, ఈయనెందుకు పైదొంగకూడదు? పోను పదనంమీద ప్రయాణం చేయడమెందుకు? ఒకవంక సినిమాలు, తీరికదొరికితే ఢిల్లీలో తన భవననిర్మాణ విషయాలు చూసుకోవడం. ఈయన్ని గెలిపించిన అలహాబాద్‌లోని ఓటర్ల సంగతేమిటి? ఈయనిలా వుంటే,

—తరువాయి 11వ పేజీలో

# పరిశ్రమకు చేటుతెస్తున్న డబ్బింగ్ చిత్రాల మోజు

కన్నడిగులకు కన్నడభాషంటే ఎనలేని అభిమానం. అలాగే బెంగాలీయులకు కూడా వల్లమాలిన భాషాభిమానం. మన వాళ్ళకు మాత్రం పొరుగింటి పుల్లగూర రుచి. అందుకే కొందరు ఇతర భాషల నుంచి తెలుగులోకి డబ్‌చేయబడే చిత్రాలంటే ఎగబడుతున్నారు. మలయాళం నుంచి డబ్‌చేయబడిన చిత్రాలంటే మన వాళ్ళకు మహామోజు. వాటికి తెలుగులో యువతీయువకులను ఆకర్షించేలా పేర్లు పెడుతున్నారు. సెన్సార్‌వారు తొలగించిన దృశ్యాలను తెలుగుకోచేర్చి విడుదల చేస్తున్నారు. ఇవి ఎక్కువగా ఉదయపు ఆటలుగా ప్రదర్శింపబడుతుంటాయి గనుక యువతరంవారు స్కూళ్ళను, కాలేజీలను ఎగగొట్టి చూస్తున్నారు. ఇవి వాళ్ళను అడ్డదారులు

—తరువాయి 11వ పేజీలో

# బోగస్ కంపెనీల వలలో ఎందుకయ్యా ఇరుక్కొంటారు?

మా మద్రాసు విలేఖరి

ఏదైనా వ్యాపారం ప్రారంభించాలంటే లైసెన్సుండాలి. ఆఖరికి షేవింగ్ సెలూన్ పెట్టాలన్నా లైసెన్సు పొందాలి. సినిమా కంపెనీకి అలాంటి లైసెన్సు అక్కర్లేదు. అందుకే సినిమా పరిశ్రమ నేడు అనిశ్చిత పరిస్థితిలో వున్నా కొత్తకంపెనీలకు కొదవలేదు. కుక్కగొడుగుల్లా తలెత్తుతున్నాయి. వీటిలో కొన్ని బోగస్ కంపెనీలు - ఇలాంటివి ఎక్కువగా హైదరాబాద్‌లో ప్రారంభించబడుతున్నాయి. సినిమా తారలైపోవాలని తహతహలాడే యువతీ యువకులను ఆకర్షించడానికి ఈ సంస్థల్లోని వారు ఎన్నో ఎత్తులువేస్తుంటారు.

ఎక్కడో ఓ ఆఫీసు అద్దెకు తీసుకుంటారు. వెంటనే పత్రికేయుల సమావేశాల్ని ఏర్పాటుచేస్తారు. తాము నూతన తారాగణంతో, సాంకేతిక నిపుణులతో ఒక విశిష్టమైన, నూతనమైన, ప్రబోధాత్మక, ప్రయోజనాత్మకమైన, ప్రయోగాత్మకచిత్రాన్ని తీస్తామంటూ ప్రగల్భాలు పలుకుతారు. పత్రికలలో అచ్చయిపోతుంది. ఎందరో యువతీ యువకులు ఆకంపెనీచుట్టూ తిరుగుతారు. ముందు వాళ్ళను మేకప్‌టెస్టులంటూ కొంతడబ్బు వసూలుచేస్తారు. అమ్మాయిలయితే మరోరకంగా వశమై, తమ సర్వస్వాన్నీ అర్పించుకుంటారు. ఇకచెప్పేదేం మరి షూటింగ్ ఎప్పుడు మొదలెడ్తారు?

కొంతడబ్బు పెట్టుబడి పెట్టేవారికే ఛాన్సు ఇస్తామంటారు. ఇలా డబ్బు వసూలుచేశాక ఒకరోజు వున్నట్టుండి అమాంతంగా బేరా ఎత్తేస్తారు. జావితో డబ్బు, మానాన్ని అర్పించినవాళ్ళు ఎంతగానో క్రుంగిపోతుంటారు.

అందుచేత, సినిమాలలో చేరాలనుకునేవారు ఒకవిషయం ఆలోచించాలి. పేరుమోసిన సినిమాతారలతో తీసే సినిమాలనే కొనేనాధుడుగాని, పంపిణీచేసే దిక్కుగాని దొరకటంలేదు. అలాంటప్పుడు అంతా కొత్తవారితో తీసేసినిమాలు ఎప్పుడు థియేటర్ల మొహంచూస్తాయి? ఎందుకిట్లాంటి బోగస్ కంపెనీలకు మోసపోవడం?

## హీరోగా మరొక నిర్మాత పుత్రుడు

ఎన్. టి. ఆర్. పుత్రుడు బాలకృష్ణ హీరోగా వెలుగొందుతున్నాడు. ఎన్. టి. ఆర్. తమ్ముడు ఎన్. త్రివిక్రమరావు తన పుత్రుడు కళ్యాణచక్రవర్తిని క్రమశిక్షణతో పెంచి, బాగా చదివిస్తున్నారు. ఇక్కడ అబ్బాయి బి. ఎ. పూర్తిచేసి, బి. ఎల్. చదువుతున్నాడు. 23 ఏళ్ళుంటాయి. ఇప్పుడాయువకుని సినిమాహీరో చేయాలనేతలంపు త్రివిక్రమరావుకు కలిగింది. ఈ యువకుని భవిష్యత్తు ఎలా వుంటుందో చూద్దాం.

## ప్రభుత్వ సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా భానుమతి

డాక్టర్ భానుమతి బహుముఖ ప్రజ్ఞావంతురాలు. తమిళనాడులోకూడా మధుర గాయనిగా, చక్కని సంగీత దర్శకురాలుగా మంచి పేరుంది. అందుచేత, తమిళనాడుప్రభుత్వం ఈమెను మద్రాసు

—తరువాయి 11వ పేజీలో

# పినాకినీతీరం

(2వ పేజీ తరువాయి)

మంచితనం, పలుకుబడివల్ల చేకూరిన పదవుల అతిశయోక్తి కాదనుకుంటాను. విదేశాలు, శ్రమకూడా అధికభాగం అతనివే; గోవిందరావుగారిచేత బిల్డింగుప్లాను వేయించడంమొదలు, నెలకు రెండుసార్లు హైదరాబాదునుండివచ్చి నిర్మాణ ప్రగతిని పర్యవేక్షించేవరకు అతను వ్యయ ప్రయాసలకు గురియైనాడు.

కేవలం వ్యక్తిగతమైన పలుకుబడికో కృషితో, శ్రమతో, చొరవతో నెల్లూరులో కాంగ్రెస్ శతవార్షిక చిహ్నంగా శాశ్వతమైన ఒక బ్రహ్మాండమైన భవనాన్ని సమకూర్చడంద్వారా జనార్దనరెడ్డి దాని ట్రస్టుబోర్డు శాశ్వత అధ్యక్షతకు హక్కు సంపాయించుకున్నాడని జాలిప్రాయం, సమర్థనకాదు, సత్యం ఇది. ఇక్కడ ఒకవాస్తవం గమనించకగిఫ్పుంటుంది. జనార్దనరెడ్డి ట్రస్టుకమిటీ అధ్యక్షత అలంకారప్రాయము, గౌరవప్రదమైనదేకాని అధికారాలేమీ లేవు; 'వీటో' లూ లేవు. అధికారమంతా ట్రస్టుదే: ఈ వాస్తవాలను తెలిసికుంటే, అనూయా పరులు తప్ప మరెవరూ దురభిప్రాయపడడానికి ఆస్కారం లేదనుకుంటాను.

పాత జా. క.

## అసభ్యవర్తన

లోకానుభవం, లోకజ్ఞానం పూర్తిగా లేని వయసులో యువకులకు ఐ. ఎ. ఎస్. వంటి వున్నతాధికారులు, మితిమీరిన అధికారాలతో కూడిన వుద్యోగాలు లభించేసరికి వారికి కన్నూ మిన్నూ తెలియడంలేదా అనిపిస్తుంది. హోదా, అధికారంతోపాటు యోగ్యతా వస్తే అవి రాణిస్తవి; వారూ రాణిస్తారు. కొందరు యువకులలో మిడిసిపాటు తప్ప, యోగ్యత లోపిస్తున్నదని చెప్ప వలసివస్తున్నందుకు విచారంగా వుంది.

పాత జాయింట్ కలెక్టరు శ్రీ బి. వి. ఆర్. కృష్ణరావుగారికి సంబంధించి టెక్టాఫోను కథ ఒకటి జరగడం, దాన్ని జమీన్‌రైతు దినపత్రిక ప్రకటించడం, ఈ శీర్షిక క్రిందకూడా ఒక వ్యాఖ్య రావడం పాఠకులకు జ్ఞాపకం వుండి వుంటుంది. ఇది జరిగి దాదాపు రెండు నెలలు కావస్తూంది. అప్పుడే ఆ వ్యవహారానికి సంబంధించిన డి. ఎస్. ఓ. కులంమీద పరాండర్ గావించబడడం, జాయింట్ కలెక్టరుగారుకూడా కడపకు బదలీగావించబడడం, ఆయన స్థానంలో కొత్తవారొచ్చి ఛార్జి తీసుకోవడం ఏనాడో జరిగిపోయింది.

ఆ కృష్ణరావుగారు, మొన్న 21 తేదీ ఎందుకు నెల్లూరుకువచ్చారోఏమో; ఇంకో ఐ.ఎ.ఎస్. దురుసువిధం మా సహాయ సంపాదకుణ్ణి ఏదో పనివున్నట్లు మంచిగా తీరికలేదన్నా ఒకటికినాలుగుసార్లు ఫోను చేసి, రాత్రి 9 గంటలప్పుడు తన ఆఫీసుకు పిలిపించుకొన్నాడట. అతనితో ఆ మాట ఈమాట మాట్లాడుతూ ఆఫీసు సిబ్బందిలో ఒకరికి సైగచేసి పాత జాయింట్ కలెక్టరు ఫోనుచేసి పిలిపించాడట. కృష్ణరావు వచ్చీరావడంతోనే మా సహాయ సంపాదకుడిమీద నోరుపారేసుకున్నాడట. జమీన్‌రైతును తిట్టాడట, అదిచేస్తాను, ఇదిచేస్తాను అని బెదిరించాడట; పరమఅనాగరికంగా, అసభ్యంగా, సంస్కారహీనంగా, మొరటుగా ప్రవర్తించాడట: ఇంత జరుగుతుంటే మా సహా... సంపాదకుణ్ణి పిలిపించిన ఆ ...

ఎస్. ఆఫీసరు కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్నాడట; ఆఫీసరు సెక్షన్లకాడు కుగా తరలిపోయే సమయం కాబట్టి ఆఫీసు సిబ్బందంతాకూడా అక్కడ మూగిందట. ఇదీ జుగుప్సాకరమైన ఆ సంఘటన.

ఇంతకూ కృష్ణరావుగారు తాను డి. ఎస్. ఒ. ను ఎలక్షన్ నిధులనుండి టెక్టాఫోను కొనిపెట్టమని కోరింది నిజమే నని మాటలలో ఒప్పుకున్నాడట; డి. ఎస్. ఓ. పదివేలరూపాయలుతెచ్చి తన టేబిల్‌మీద పెట్టాడని, ఎలక్షన్ నిధుల నుండి డ్రావేయలేదని తాను వద్దుపొమ్మని చెప్పానని కృష్ణరావు అంగీకరించాడట; కాని తాను ఆ పదివేలు చేత్తో ముట్టుకోకుండా, కలెక్టరుకు రికార్డుచేయాలని ఆయన చెప్పాడట. అంటే కృష్ణరావు 21 తేదీ ఒప్పుకున్నదానినిబట్టి మేము వ్యాఖ్యానించినదానితో ఒక్కటే పొరపాటుంది; ఆ పదివేలరూపాయలను కృష్ణరావు కలెక్టరుకు ఇచ్చాడని వ్రాశాం; తాను డబ్బు ఇవ్వలేదని, డి. ఎస్. ఓ. మీద ఫిర్యాదుచేశానని ఆయనంటున్నాడు. అంతే,

కాని అనాడు మేమువేసిన ప్రశ్నలు ఈనాడూ ప్రశ్నలుగానేవున్నాయి - ఆ వున్నతాధికారి తనక్రింది అధికారిని ఏ పద్దుకిందకాని టెక్టాఫోను కొనమని ఎందుకడగాలి? ఎలక్షన్ ఖర్చులనుండి కొనమన్నది నిజమైతే అది అక్రమంకాదా? ఈ పాతప్రశ్నలకు ఒక కొత్తప్రశ్నను కూడా చేర్చవచ్చునేమో అనిపిస్తున్నది - ఒక అసెద్దు ఐ. ఏ. ఎస్. ఆఫీసరు టేబిలుమీద అతని సబార్డినేటు పదివేల రూపాయల డబ్బును తీసుకపోయి పెట్టడానికి ఎన్నిగుండెలుండాలండి? అసలు అందుకు సాహసించగలడండి?

పత్రికలో వచ్చింది తప్పనుకుంటే, అభూత కల్పననుకుంటే, అవమానకరమనుకుంటే సంపాదకుడిని మాట్లాడాలి; లేదా అతనికి వ్రాయాలి; అదికాకుంటే అతనిమీద చట్టరీత్యా చర్యతీసుకోడానికి ప్రయత్నించాలి? అంతేకాని సహాయ సంపాదకుడికి ఏమి సంబంధం? అతనిపట్ల అసభ్యంగా, అవమానకరంగా ప్రవర్తించడానికి ఇతనికి అధికార మెవరిచ్చారు? తనకు జరిగిన అవమానానికి జాయింటు కలెక్టరుమీద ఆ సహాయ సంపాదకుడు న్యాయరీత్యా చర్యకుపక్రమిస్తే ఎట్లా వుంటుంది?

ఇంతకూ మా సహాయ సంపాదకుణ్ణి పిలిపించుకున్న ఆ ఐ.ఎ.ఎస్. అధికారి సముచంచనను ఏమనుకోవాలి? ఐ. ఎ. ఎస్. వారి గౌరవాన్ని ఇటువంటి సంఘటనలు పెంచుతాయా, దిగజార్చుతాయా ఒకసారి ఆలోచించండి.



## జనవాణి

(8వ పేజీ తరువాయి)

కలెక్టర్ జోక్యంచేసుకొని బాలాజీ. ఏ. సి. నగర్‌లకు కనీసం రెండు టౌను బస్సులైనా కిరికిరి కుండకుండా వచ్చి పోయే ఏర్పాటుచేయగలిగితే బాగుంటుంది.

నెల్లూరు —చక్కిరాల శ్రీనివాసులు

### బస్సులలో రద్దీ తగ్గించలేరా?

నెల్లూరుజిల్లా వరకు, ఏ రూటులో కూడా కాలినవన్ని బస్సులులేవు. ఆర్‌టిసి గాని, ప్రైవేటు బస్సులుగాని, చాలా పరిమితమైన సంఖ్యలోనే నడుస్తున్నాయి. ప్రయాణీకుల సంఖ్యతో పోలిస్తే, ఇవి ఏమాత్రం చాలవు: అందువల్లే, ఏ రూట్‌లో బస్సు చూసినా జనం క్రిక్కిరిసి వుంటున్నారు. అడుగుపెట్ట తావు లేకుండా త్రొక్కుతున్నారు.

పూడిపర్తి, పర్వేపల్లి తదితర రూటులలో పరిస్థితి ఎంతదుర్భరంగావుందేది మనం చూస్తూనేవున్నాం, పొదలకూరు, చేజర్ల తదితర రూట్‌లతో బస్సు టాప్ పైనకూడా సందువుండదు. ఇందుకూరుపేట, మైపాడు తదితర గ్రామాలపరిస్థితి కూడాఅంతే; అల్లూరు రూట్‌లో ఒక్కసారి బస్సు ఎక్కితేచాలు, బస్సులంటేనే రోతపుట్టుంది.

ప్రయాణీకుల రద్దీ పెరిగేకొద్దీ బస్సుల్లో అదనపు తెడాషుండడంలేదు, జనసమ్మర్దాన్ని ఈడుకొని అటుఇటు తిరిగే కండక్టర్లు; జనాన్ని బస్తాల్లో వస్తు క్రుక్కినట్లు క్రుక్కి క్లీనర్లు ప్రయాణీకులపట్ల మొరటుగా కూడా వ్యవహరిస్తున్నారు; అడపాదడపా చేయిచేసుకొంటున్నారు. దీనికి వారిని నిందించి ప్రయోజనం లేదు. ఆ జనంలో, టికెట్లకు తంపాకాల దబంటలగా. సహన మూర్తులవలె వ్యవహరించడం ఎవరికి సాధ్యంకాదు.

అధికారులు ఈ పరిస్థితి అర్థంచేసుకొని జనంరద్దీ ఎక్కువగావుండే అన్ని రూట్లలో అధికసంఖ్యలో బస్సులు నడపడం అవసరం. ఓవర్‌లోడింగ్ చట్టవిరుద్ధం; బస్సులు పరిమితమై, ప్రయాణీకుల అవసరమైనప్పుడు, సిబ్బంది వద్దన్నా, జనం లోనుకొని ఎక్కుతారు, ఈ చట్ట ఉల్లంఘన నివారించడానికి అధికసంఖ్యలో బస్సులునడపడం ఒక్కటే నివారణోపాయం. దీనివల్ల ప్రభుత్వానికి అధికమొత్తంలో రవాణాసమ్మ లభిస్తుంది; ప్రయాణీకుల సమస్యలూ తీరుతాయి.

నెల్లూరు —డాక్టర్ జె. శ్రీరాములు

# మైకా పరిశ్రమ

(2వ పేజీ తరువాయి)

దేశసటంలో నేకాక, అంతర్జాతీయ మార్కెట్‌లో కూడా గూడూరుకు ఒక ప్రత్యేకతను, ప్రాశస్త్యాన్ని సంతరించి పెట్టిన మైకావ్యాపారం ఇంత పతనం చెందడానికి, ప్రభుత్వ లోపభూయిష్ట విధానాలు కారణం కావడం దారుణం. మైకా పరిశ్రమ అభివృద్ధి లక్ష్యంగా కేంద్రప్రభుత్వం నెలకొల్పిన ఎం.ఎం.టి సి. సంస్థ, మైకా పరిశ్రమకు సమాధి కట్టడం ఇంకా ఘోరం.

ఇదివరకు మైకావ్యాపారులు విదేశీ అర్డర్లు తామేతెచ్చుకొని, తామే ఎగుమతి చేసుకునేవారు. ఎటువంటి నిర్బంధాలూ వుండేవికావు. ఎం.ఎం.టి సి. వచ్చిన తర్వాత, ప్రతివ్యాపారి తన విదేశీ అర్డరులో విధిగా 60 శాతం ఎం ఎం టి సి ద్వారానే ఎగుమతి చేయాలనే నిర్బంధం విధించారు. దీనితో గని యజమానులకే కాక వ్యాపారులకుకూడా నిరుత్సాహం ఏర్పడింది. ఎం ఎం టి సి, పరిశ్రమాభివృద్ధి ఉద్దేశించిన ప్రభుత్వసంస్థ గాకాక, రాబడిమామూలుదండే గూండా సంస్థగా తయారైంది. పీరిచ్చేధర గిట్టుబాటుకాక, వ్యాపారులు అసలు ఎగుమతులే మాన కున్నారు.

ఫలితంగా గనుల యజమానులదగ్గర మైకా నిల్వలు కుప్పతెప్పలుగా పేరుకొనిపోయాయి, వాటిని కొనేవారులేక; కొన్నా గిట్టుబాటుధర రాదు. ఈ సంక్షోభంలో పలువురు యజమానులు దివాలా తీశారు; పెక్కుగనులు మూతపడ్డాయి. పరిశ్రమ శిధిలమైపోయింది.

అంతటిఖ్యాతినందుకున్న మైకా పరిశ్రమను ఎం.ఎం.టి.సి. సంస్థ చెదపురుగువలె పట్టి, పీడించి, నాశనంచేసినప్పటికీ, దీన్ని పునరుద్ధరించి, పునర్జీవనం కల్గించగల స్తోమతకూడా అదే సంస్థకు మాత్రమేవుంది.

ప్రస్తుతం గనియజమానుల దగ్గర వున్న మైకానిల్వలన్నింటినీ ఈ సంస్థ కొనుగోలుచేసి, తదనంతరం వచ్చే ఉత్పత్తిని వ్యాపారుల ఇష్టానుసారం దిగుమతి చేసుకునే సవతికల్పిస్తేచాలు - పరిశ్రమ దానంతటఅదే అభివృద్ధిచెందుతుంది. బ్రెజిల్ దేశంలో ఒకసారి కాపీగింజల ఉత్పత్తి విషయంలో ఇటువంటి సంక్షోభమే తలెత్తితే, వారి ప్రభుత్వం మొత్తం నిల్వలన్నింటినీ తానే కొనుగోలుచేసి డిమాండుసృష్టించింది, రైతులు బాగుపడ్డారు; పరిస్థితి మెరుగైనతర్వాత ప్రభుత్వమూ వాటిని విక్రయించి లాభపడింది. అదేరహాలో మన కేంద్రప్రభుత్వం దయదలిస్తే మైకాపరిశ్రమకూడా తిరిగి జీవంపోసుకుంటుంది.

లేదా, పరిశ్రమను, ఎం ఎం టి సి కబంధహస్తాలనుండి తప్పించినా చాలు. తన కాళ్ళమీద తాను నిలవగలిగిన స్తోమత మైకాకువుంది, కనుకజిల్లాలోని ప్రైవేట్ గనులను ఎం ఎం టి సి నుండి తప్పించిన తర్వాత, ఎంతో అభివృద్ధి సాధించాయి, ఆ సత్యం కట్టుకుంటేచాలు.

ప్రభుత్వం ఏదో ఒక రూపేణా మైకా సంక్షోభాన్ని పరిష్కరించవలసిన తరుణమిదే; అలస్యంచేస్తే, మీనమేషాలు లెక్కిస్తే మైకా చరిత్రలో భాగంగా కలిసిపోక తప్పదు.

—మా గూడూరు విలేఖరి.

# మండలాలు

(4వ పేజి తరువాయి)

## తడ

పన్లూరుపాడు, కదలూరు, పలి చేంద్ర, గొల్లలమూలం, పల్లిపాలెం, కారి జాత, రోషరుంద్రిగ, కొండూరు, మాం బట్టు, అక్కంపేట, వెంగలవాగు, వాటం బేడు, దేవుని అంద్రిగ, గ్రద్ద గుంట, అండగుండాల, తడ అంద్రిగ, తడ, పూడి శ్రీ మూలవారిపాలెం, కరూరు, పెరియవట్టు, రామాపురం, వన్నంగాడు, ఇరకాం, వేనాడు

మొత్తం 25 గ్రామాలు

## వెంకటగిరి

యాచసముద్రం, కడికంపూడి అంద్రిగ, కలపాడు బంగారు యాచ సముద్రం, విశ్వనాథపురం, పాతవోలు, చింతలచెరువు అంద్రిగ, పాలెంకోట, సిద్ధవరం, అక్కమాంబాపురం, చింత గుంట, లాలాపేట, జువ్విమాను అంద్రిగ గుండ్లసముద్రం, తాలసముద్రం, బంగారు పేట, కుమ్మరగుంట, బొప్పాపురం, వెంకటగిరి, బంగాలపల్లి, పెట్లూరు, బొమ్మగుంట, పెరియవరం, అమ్మవారి పేట, సోమసానిగుంట వంకోటవ్రతం, మొగలపూడి, సానమ్మచెరువు అంద్రిగ, త్రిపురాంతక బొల్లపల్లి రామస్వామి వారి అంద్రిగ, ధర్మపురం, వడ్డిపల్లి దర్శ వెల్లవారి అంద్రిగ, మునకవానిపల్లి, నాయుడుచెరువు అంద్రిగ, చింతలపల్లివారి అంద్రిగ, కైలాసనాథపురం, చెలికం పాడు, చెలికంపాడు మన్నేగుంట, దాచెరువు జోస్యుల అప్పలాచార్యుల అంద్రిగ, చింతంగుంట వెంకటప్ప అంద్రిగ, కర్ణాగుంట, బసవాయగుంట, పూలతంగడిపల్లె మన్నేగుంట, అక్బర్ నివాస్ అంద్రిగ, మనలాబపేట, చీవిరెడ్డి పల్లి, గొల్లగుంట, మొగళ్ళగుంట, చిన్న గొట్లగుంట లింగంబాయుడుపేట, చిన బందారుపల్లి బసపాలెం, పెదబందారు పల్లి, తిమ్మాయగుంట వంజాం, బలి వేలు మంగాపురం, కమ్మపల్లి, యాత లూరు, పల్లిపేడు, శ్రీమాధకదారు అంద్రిగ, పింగమాంబాపురం, చిన్నన్నపేట, విద్యుత్ కుమార యాచసముద్రం, కలవం పూడి, ఉప్పలపల్లి, కుమ్మరపేట, కంద నాలపాడు, వర్ధనంపల్లి, బోగులవారిపల్లి, లక్ష్మీరాంపల్లి, పాపమాంబాపురం, కున్నం పల్లి, అయ్యపపాలెం, పాతపల్లి మద్దంపల్లి,

మొత్తం 78 గ్రామాలు

## బాలాయపల్లె

పల్లిపాడు, గొట్టికాడు, సుబ్రహ్మణ్యం, కయ్యూరు, అక్కసముద్రం, పోతపూడి పిగిలాం కొత్తపాలెం, జయంపు, జాయురు చెరువు అంద్రిగ, హస్తకావేరి బర్లపాడు, కొమ్మలగుంట, పిగిలాం, తిక్కవరం, అరిగేపల్లి సిద్ధాపురం, తక్క పల్లి, నిడిగల్లు, బాయనగుంట, కాత్రి గుంట, కలిమెనగుంట, జామకూరు, కలం గంధ, ఓట్లపల్లి, పాపిరెడ్డిపల్లి, వాక్యం, నిండలి వెంకటరెడ్డిపల్లి, అంబలపూడి, అలిమిలి, చుట్టి, చల్లవతను అంద్రిగ, కదగుంట, వెంగమాంబాపురం, యాత వర, రామాపురం, బాలాయపల్లి, మన్నూరు, కోటవేడు, నురభివారి అంద్రిగ, కోవంగుంట, చిలమానూరు, మురహరి దొరవారి అంద్రిగ, మల్లెమాల కోవూరువారి గుంట, వైకపరం, వంగ వరం, గొల్లగుంట, మేబ్బారు, పెరిమిడి, చక్రచార్యులవారి అంద్రిగ.

మొత్తం 61 గ్రామాలు

## డక్కిలి

దేవులపల్లి, మాధవాయపాలెం, చెర్లో పల్లి, కొత్తచెరువు, వెలికల్లు, వీరకుమార యాచసముద్రం, స్వర్ణ యాచసముద్రం, వంగవపల్లి, మర్లగుంట, వెంబులూరు, వెలంపల్లి, కుప్పాయపాలెం, గొల్లవాని గుంట, వెంపటివారిపల్లి, డక్కిలి, కండ్ల వారి అంద్రిగ, యెల్లావజ్జలపల్లి, కొత్త నలప్పాకు, కోవేశ్వరభొట్లపల్లి, శ్రీను వరం, పాతనాలపాడు, చాకలపల్లి, నాయుడుపాలెం, లింగసముద్రం, దత్తా నగరం, అత్తలసిద్ధవరం, మాతలచెరువు అంద్రిగ, అల్తూరుపాడు, నమశ్శివాయ పురం, తిమ్మాయపాలెం, మూర్యాపాలెం, మోపూరు, నాగులపాడు, పెదయాచ సముద్రం, చావళ్ళపల్లి, వలిగోడు, చీక లేనిపల్లి, మహాసముద్రం, తిమ్మనగుంట, తీర్థంపాడు, నాగవోలు, చెన్నసముద్రం, వెనుకగుంట, దగ్గవోలు, దండవోలు, దండోలు ఉప్పలపల్లి, శ్రీపురం, వెంగమ నాయుడుపల్లి, మాటుమడుగు, బిడింపల్లి.

మొత్తం 50 గ్రామాలు.

— —



దినెల్లూరు కో-ఆపరేటివ్ హౌస్ బిల్డింగ్ సొసైటి లిమిటెడ్ (V 271) నెల్లూరు.

### వేలము నోటీసు

The Nellore Co-op. House Building Society Ltd., V. 271, Nellore –Decree Holder

1) మన్నెం నరసారెడ్డి 2) మన్నెం కాంతమ్మ –Judgement Debtors

Date of Sale : 11-7-85

పై సొసైటివారికి రావలసిన మొత్తము బాకీ రాబట్టుకొనుటకుగాను జె.డి.ల యొక్క షెడ్యూలు స్థిరాస్తి అంటివి పదరు ఆఫీసువద్ద 11-7-85 తేది 11 గంటలకు సబ్‌రిజిస్ట్రారు అర్బిట్రేటర్ వారిచే బహిరంగవేలము వేయబడును. పాటదారులు వేలము షరతులకు లోబడి పాట పెట్టవచ్చును. ఇతర వివరములు ఆఫీసు పనిచేయు కాలంలో ఆఫీసులో తమగొనవచ్చును

– షెడ్యూలు –

నెల్లూరు రిజిస్ట్రేషన్ నెల్లూరు సబ్‌రిజిష్ట్రరులో చేరిన నెల్లూరు బిట్టు II గ్రామము బాలాజీనగరులో చేరిన ప్లాటు నెంబరు 30, 31లో సర్వే నెంబరు 585/2 య. 0-42లు, 584/2 య. 1-36, 579 య. 0-62 540 య. 0-36, 583/2-3 య. 0-12, 580/ఎ య. 0-58 580/బి య. 0-51ట్లు కుల్లు 4-57 ట్లు హద్దులు : తూ] ప్లాటు నెంబరు 38 & 39 ప] చిలమన రుక్మిణమ్మ స్థలం (Vendor) ఉ] ప్లాటు నెం 29 ద] రోడ్డు.

ఈ హద్దులలోని 77 అంకణములు 56 చదరపు అడుగుల స్థలం మరియు కట్టబడిన మిద్దె ఇల్లు దానికి సంబంధించిన తలుపులు ద్వారబంధనములు వగైరాలు.

ఆర్.ఎల్. నరసారెడ్డి
ప్రెసిడెంటు

# బోగస్ కంపెనీలు

(9 వపేజి తరువాయి)

లోని ప్రభుత్వ సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా నియమించింది. ఇది కొందరు తమిళులకు, సంగీత విద్వాంసులకు కన్నెర్ర జేసింది. "ఏ.ఎం.ఎల్. వసంత కుమారినో, ఎం.ఎస్. సుబ్బలక్ష్మినో నియమించవచ్చుకదా?" అని కొన్ని తమిళ పత్రికలు విమర్శించాయి. కాని, సంగీత విద్వాంసురాలవడం వేరు; సంగీత కళాశాలను నిర్వహించడం వేరు. ఆ పదవికి భానుమతి సమర్థురాలన్న నమ్మకంతోనే తమిళనాడు ప్రభుత్వం నియమించింది. ఆ పదవికి తాను అన్నివిధాలా అర్హురాలని భానుమతి నిరూపించి తీరుతుంది.

### కాతినేని దర్శకత్వంలో మళ్ళీ బాలకృష్ణ నటిస్తాడా?

బాలకృష్ణ కాతినేని ప్రసాద్ కాంబినేషన్‌లో లోగడ కొన్ని చిత్రాలు తయారయ్యాయి. అప్పుడు కాతినేని ప్రసాద్ తండ్రి కాతినేని ప్రకాశరావు తెలుగు దేశం పార్టీలో ప్రముఖుడుగా వుండేవారు. ఆయనకి, రామారావుగారికి ఏవో భేదాభిప్రాయాలొచ్చి, ఇద్దరిమధ్య పచ్చ గడ్డివేస్తే భగ్గుమనే పరిస్థితి ఏర్పడింది కత్పరింగా విభేదాలు... కీయాలు చోటుచేసుకున్నాయి. ఎన్. టి. ఆర్ తో పాటు బాలకృష్ణ నటించిన జగపతివారి 'భార్యాభర్తల బంధం' చిత్రాన్ని డైరెక్ట్ చేయడానికి కాతినేని ప్రసాద్ నియమించబడ్డాడు. కాని, బాలకృష్ణ ఒప్పుకోనందువల్ల నిర్మాత వి. బి. రాజేంద్రప్రసాద్ డైరెక్ట్ చేశాడు.

ఇప్పుడు ఎన్. టి. ఆర్., కాతినేని పరివారాలమధ్య అగాధం పూడి పోయి మళ్ళీ ఇద్దరూ ఒకవైపుకు తెలుస్తోంది. ఇక కాతినేని ప్రసాద్ దర్శకత్వంలో బాలకృష్ణ నటించవచ్చు.

— —

# డబ్బింగ్ చిత్రాలు

(8వ పేజి తరువాయి)

తొక్కించేమాటఅటుంచితే, వీటిప్రభావం తెలుగు చిత్రపరిశ్రమమీదకూడా అంతో ఇంతో పడిపోతూనేవుంది. డబ్బింగ్ సినిమాలను కొన్న కొనుగోలుదారులు బాగానష్టపోయారు. మొదటికాపీ వచ్చి, విడుదలకు నోచుకోని డబ్బింగ్ చిత్రాలు ఎనభైకిపైగా వున్నాయి. నిర్మాతలడబ్బు కొన్నికోట్లవరకు బ్లాక్ అయిపోయింది.

అసలు వారానికి ఒకటిరెండుచిత్రాలు విడుదలవుతూండగా ఈ డబ్బింగ్‌చిత్రాల బాధి ఎందుకు? కర్నాటక, బెంగాల్ రాష్ట్రాలలోని ప్రజలంతా ఏకమై, పర భాషా డబ్బింగ్ చిత్రాలను ప్రదర్శించ రాదంటూ ఒక ప్లవాన్నిలేపి, థియేటర్ల యాజమాన్యాన్ని హెచ్చరించారు. అది కాక ప్రతి థియేటర్‌లోనూ కన్నడచిత్రాలను విధిగా ప్రదర్శించాలనే చట్టాన్ని కర్నాటక ప్రభుత్వం ప్రవేశపెట్టేలా చేశారుకూడా దాంతో కన్నడ చిత్ర పరిశ్రమ కొంతవరకు కుదుటపడింది. డబ్బింగ్ చిత్రాలనుమాని, అందరూ కన్నడచిత్రాలనే విర్మిస్తున్నారు.

అక్కడి ప్రేక్షకులలో వచ్చిన గొప్ప మార్పు మనవారిలో రాదా?

అట్లాంటినిర్ణయాలను తీసుకునేంతటి భాషాభిమానం మన ప్రేక్షకులకువుందా?

— —

# అమితాబ్

(8వ పేజి తరువాయి)

ఆ నియోజకవర్గం ఎలా అభివృద్ధి చెందుతుంది?" అని విమర్శించారు.

ఇదిలావుండగా అమితాబ్‌తో 'జంజీర్' చిత్రం తీసిన ప్రకాష్‌మెహ్రా "సూపర్ స్టార్ మళ్ళీ సినిమాలలో బిజీ అయిపోతాడు.... చూస్తారుగా!" అనడం మరి కొందర్ని మరింత కలవరపెట్టింది.

అయితే, అమితాబ్ ఏమాత్రం చలించ లేదు. "నాచిత్రాల బెనిఫిట్ షోలు ఏర్పాటు చేసి, వసూలయ్యే మొత్తంతో నా నియోజకవర్గాన్ని ఎంతగా అభివృద్ధిచేస్తానో మీకే తెలుస్తుంది." అన్నాడట.

సునీల్‌దత్ కూడా కొన్ని సినిమాలలో నటిస్తున్నాడు.

గెలిపించిన ఓటర్ల ఆక్రందనలు వినే వారెవరు?

ప్రజాప్రతినిధుల తీరు ఇట్లా ఉంటే, దేశం ఏమయ్యేటట్లు?

— —







## అర్చకుడు కావలెను

నెల్లూరు తాలూకా బుజబుజ నెల్లూరు శ్రీ రామాలయమునకు అర్చకులుగా శ్రీ వైష్ణవులు కావలయును. శ్రీ రామాలయములో అవసరకాలులుగా వుండవలయును. నెలకు రు. 300/-లు జీతము ఇస్తూ ఇల్లు ఇవ్వబడును. ఆసక్తికలవారు శ్రీ వాకాటి కన్నయ్య శెట్టి ఆర్య వైశ్య కల్యాణనిలయము శిఖరంవారి వీధి నెల్లూరు-1 సంప్రదించవలయును.

In the Court of the Ist Additional Subordinate Judge, Kurnool

O. S. No. 128/84

Central Bank of India, Kurnool, represented by its Branch Manager –Plaintiff

D. Badukaiah and 2 Others –Defendents

NOTICE TO

1) Budan Sab S/o. Bashu Miah

2) K. Hanumantha Reddy S/o. Thippa Reddy

both are residents at Tallapuram village Alampur Tq.

వాది మీపై పై కోర్టులో తనకు రావలసిన మొత్తంనకు దావా దాఖలు చేసి వున్నాడు. మీరు పైకవిన కోర్టులో హాజరగుటకుగాను 10-7-85 వ తేదీన వాయిదా వున్నది. కావున మీరు పై కోర్టువారి ఎదుట 10-7-85 వ తేదీన హాజరు కావలయును. అట్లు మీరు పై కోర్టువారి ఎదుట హాజరుకాకున్న ఎడల పై దావా మీ పరోక్షమందు తీర్మానించబడునని మీకు తెలియజేయనైనది.

–వి. సామిరెడ్డి
పిటిషనరు తరపు అడ్వొకేటు

